# శ్రీ రాఘవేంద్ర కథాసుధా స్రవంతి



రచయిత :

మధురకవిరత్న - కవిశేఖర - కావ్యార్క

మహాలా పేరన్నశాస్త్రి

విజయనగరం-2.

# శ్రీ రాఘవేంద్ర కథాసుధా ప్రవంతి



This book is published with the
Financial Assistance of
Sri Tirumala Tirupati Devasthanam
under their scheme
Aid to Publish Religious books

ఈ కావ్యము
శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానము వారి ద్రవ్యసహాయము వలన
ముద్రితము.

వారికి నా హృదయపూర్వక కృతజ్ఞతలు.

ప్రథమ ప్రచురణ.

ప్రతులు - 750



వెల : **20-00**

ప్రాప్తిస్థానము :
మధురకవిరత్న - కావ్యార్క - కవిశేఖర
**మహాలా పేరన్నశాస్త్రి**
డోర్ నెం. 25-11-16
అయ్యకోనేరు తూర్పుగట్టు
విజయనగరం-2.
Pin. 535 002.

ముద్రణ :
శ్రీ కృష్ణా పవర్ ప్రెస్
విజయనగరం-535 002.
ఫోన్ : 25540



శ్లో॥ పూజ్యాయ రాఘవేంద్రాయ
సత్యధర్మ రతాయచ
భజతాం కల్పవృక్షాయ
నమతాం కామధేనవే॥

# సవరణలు

| పేజి | పద్య సంఖ్య | చరణము | తప్పు | ఒప్పు |
| --- | --- | --- | --- | --- |
| 26 | 1 | 4 | చిత్తుండనై | చిత్తుండునై |
| 40 | 9 | 8 | ననుగావంగ | ననుంగావంగ |

## ఆమోదము

విద్వాన్ - శ్రీమాన్ ఉ॥ వె॥ కుంటిమద్ది శేషశర్మ గారు
అనంతపురం

సీ॥ శాకిమూకలఁ బోలుచు కాపురుషులు
పుట్టుచుందురు పలువురు గిట్టుచుంద్రు
ధన్యులగువారె ప్రాకృతతనువుతోడ
నేని జీవింత్రు, కీర్తికాయానగాని.

ఉ॥ పేరనశాస్త్రి, విశ్వజనవిశ్రుతకీర్తిని రాఘవేంద్రు సం
సారదురంతదుఃఖములఁ జయ్యనఁ బాపఁగఁ జాలువాని వి
స్తారమహత్త్వపూర్ణు, బహుదా రసతుందిలహృద్యపద్యమం
దారసుమవ్రజంబుల నుదారముగా నుతియించెఁ గాంచుడీ!

## కృతిప్రశంస

కవిసార్వభౌమ స్వారాజ్యకవి అష్టావధాని
మ॥రా॥శ్రీ వడ్డాది సీతారామాంజనేయకవిగారు, విశాఖపట్నం-29

సీ॥ ధన్యమగు రాఘవేంద్రకథాస్రవంతి
నాంధ్రమాతను స్రాఁగించి నట్టి నిన్ను
రాఘవేంద్రుఁడు సకల భద్రముల నొసఁగి
మనుచుఁగావుత మూల పేరనకవీంద్ర!

మ॥ యతియున్ ద్వైతమతప్రవక్తయును, ధన్యాత్ముండు శ్రీరాఘవేం
ద్ర తపోరాశిసమాధిసంస్థితుని తద్గాథన్ దగన్ సత్కృపన్
ధృతితోఁ దెల్పునఁ బద్యకావ్యముగఁ బేర్మిన్ గూర్చి నీజన్మమున్
కృతకృత్యంబుగఁ జేసికొంటివికవీ! శ్రీమూలపేరేశ్వరా!

క॥ శ్రీరాఘవేంద్రుని మహా
దారాశీస్సులను బొంది ధరవర్థిలుమా
పేరనకవి! దీర్ఘాయు
శ్శ్రీరంజిల మూలరామకృపసమకూరున్.

క॥ జీవసమాధిస్థితునిన్
భావన మంత్రాలయాదివాసిని యతినిన్
దేవనిభు రాఘవేంద్రుని
కైవల్యప్రదుని పేరకవి పొగిడి మనెన్. 4

గీ॥ ఆర్తులకు నాశ్రయులకు నిత్యముఁగృపను
బ్రాపుగానుండి రక్షించు రాఘవేంద్రు
దివ్యకథల భువిని స్రవంతిగను నెఱపి
ప్రబలెఁ గద పేరనకవి భగీరథుఁడు గాఁడె. 5

క॥ మూలాపే రనకవిమం
త్రాలయగురు రాఘవేంద్రయతిసత్కృప వాం
ఛాళిన్ దీర్చుచుఁ బ్రోచుత
శ్రీలు ప్రసాదించినీదు సేవ కలరుచున్. 6

గీ॥ పావనులఁ బండితులఁ జేయు ప్రథిత సుచరి
తమ్ము రాఘవేంద్రకథాసుధాస్రవంతి;
యాంధ్రభువి పేరనా! ప్రవాహముగ నెఱపి
ఋషివరేణ్యుఁడుగాఁ బేరెసఁగ మనవె. 7

గీ॥ నాస్తికోత్కర మాస్తికులై స్తుతమతి
నాంధ్రభువిలోన వెలయుదురయ్య యెపుడుఁ
దనరు రాఘవేంద్రకథాసుధాస్రవంతిఁ
గ్రుంకులిడి పేరనకవి! యకలంకహృదయ! 8

గీ॥ రాఘవేంద్రుండు మనదు మహాఘములను
క్షిప్రముగఁ బాపి మనల రక్షించుగాక
దయను రాఘవేంద్రకథాసుధాస్రవంతి
యందు నవగాహనమ్ము నింపారఁగూర్చి. 9

# శ్రీ రాఘవేంద్రస్వామి కథా సుధా స్రవంతి

శ్రీకారంబును జుట్టినాఁడ యతిరాట్ శ్రీరాఘవేంద్రప్రభు
శ్రీకల్యాణకథాసుధన్ దెలుఁగునన్ జెప్పన్ దలంపూనితిన్
బాకాలంకృతమాధురుల్ గణయతిప్రాసల్ రసంబుల్ గుణా
నీకంబుల్ కృతినింప వేఁడెదను తండ్రీ! రామచంద్రప్రభూ!

శా॥ ఆస్వాదించి సమస్తభక్తతతి బహ్వానందసందోహ మెం
తే స్వాంతంబునఁబొంద నారసనపై నీవుండి జొప్పింపుమీ
సుస్వాదోక్తిరసప్రసారముల నస్తోకంబుగా రాఘవేం
ద్రస్వామిన్ గురియించి గూర్చుకృతిలోనన్ నీవు వాగీశ్వరీ!

మ॥ రసవంతంబగు సత్కవిత్వమును గూర్పన్ నేర్పు నాకీయవే
పసిప్రాయంబుననుండి నేటివర కావ్యాయంబుజేకూరగా
ససియా సత్కృతులెల్లఁ జేసితివి మెచ్చన్ దజ్ఞు; లట్లీకృతిన్
రసవంతంబుగఁ దీర్చిదిద్దదగు భారం బూనుమా! యంబికా!

శా॥ నీభక్తుండగు రాఘవేంద్రమహిమానీకంబుఁ బద్యాలలో
శోభాయుక్తముగా రచింతును రసస్ఫూర్తుల్ విడంబింపఁగా
నాభారంబువహించి వత్సలత గ్రంథంబీవె పీయుషధా
రాభన్ జేయుము వాజివక్త్రదయ శ్రీరామామనోవల్లభా!

చ॥ వననిధికిన్ దనూజవయి, వారిజనాభుని కూర్మిపత్నివై
వనజజు మాతవై, విబుధవర్గనమస్కృతవై, సదాశ్రితా
వన వయి యొప్పు నిన్నొకటి ప్రార్థన చేసెదఁ బ్రోవుమమ్మ! పా
వనతరదృష్టితోఁ గృతిని పై నిఁక ముద్రణదాత నిందిరా!

ఉ॥ చిక్కులలోనఁ జిక్కువడి చేతులు రెండు మొగిడ్చి, భక్తితో
గ్రక్కున మ్రొక్కినంతఁ గడగండ్లు చటుక్కునఁ దూల్చు వేల్పు స
మ్యక్కరుణాకరుం డయిన మాన్యుఁడు రాముఁడు నమ్ము సేవకుం
డక్కపిమూర్తి మారుతి సమాదృతి మత్కృతి నోముఁ గావుతన్

ఉ॥ అంధున కక్షివీక్షణము, లోపయి మూగకు మాటలాడు శ
క్తిం ధరణీధరేంద్రములఁ గ్రీడగ పంగుఁడు దాఁటునట్లుగా
నంధకవైరి! సల్పఁగ సమర్థుఁడవాదృతి నాకృతిన్ ననున్
బంధురరీతిఁ బ్రోవు మని పాణులు మోడ్చి నుతింతునీశ్వరా!

గీ॥ తొలుతఁ బూజల నందెదు దొడ్డవేల్పు!
గురుతరాంతరాయమ్ములఁ గూల్చు వేల్పు!
అమర శుభములనిచ్చి విఘ్నముల గూల్పఁ
గొలుతుఁ దలవంచి భక్తి నిన్ గుజ్జువేల్పు!

ఉ॥ పద్యములన్ బఠించినను బన్నని జ్ఞాపకశక్తి గల్గు నా
హృద్యములైన శబ్దములు హృద్గతమై వెసనిల్చు నిత్యమున్
గద్యమునందునన్ గథలె జ్ఞాపకముండును గాన, గణ్యమౌ
పద్యమెయంచు మున్ననిరి పండితులన్ గవిసార్వభౌములున్

చ॥ గణయతిప్రాసలున్ గలిగి కప్రపుఁ బల్కులవంటి మాటలున్
గణుతికి నెక్కు భావములు, నాకధునీసమమైనధార, స
ద్గుణములు, మేలంకృతులు దోషవిహీనతశయ్యనొప్పు; ల
క్షణమగు పద్యముల్ జదువ జ్ఞానము జ్ఞాపకవృద్ధిఁ గల్గెడిన్.

మ॥ కలమున్ బట్టి కవిత్వమల్లు బుధవర్గంబెల్ల వాణీస్వరూ
పులు నన్మద్గురుదైవతమ్ములని కైమోడ్పుల్ సమర్పించి పే
శలవాగ్ధోరణి రాఘవేంద్రమహిమాంచద్గాథ లాంధ్రమ్మునన్
దెలుపన్ బూనితి నేర్చినట్టిగతి భక్తివ్యాప్తి శోభిల్లగన్.

మ॥ మహనీయుండగు రాఘవేంద్రయతిరాణ్మాహాత్మ్యమున్ దెల్ప వా
గ్మహిళాదేవికిఁగాక యన్యులకు శక్యంబౌనె; తల్లీలలన్
మహిలోఁ గొన్నిటి మాత్రమేను వచియింపన్ బూనితిన్ నీ య
గ్రహమర్థించెదఁ గావ్యపూర్తి యమరంగా! రామచంద్రప్రభూ

చ॥ అసహనబుద్ధి నో సరసిజాసన నాదరితానుభూతిదు
ర్వ్యసనము నీకుఁదోఁచినట్లు వ్రాయుము నానుదుటందు, గాని, యే
రసికత లేని మూర్ఖులకు రమ్యకవిత్వ నివేదనోద్యమ
వ్యసనము మాత్ర మించుకయు వ్రాయకు వ్రాయకు
వ్రాయకెన్నఁడున్ 13

ఉ॥ వ్రాయుట నాదువంతు, మృదుభావరసప్రచురార్థసూక్తిగాఁ
జేయుట వాణివంతు, కృతిఁ శీఘ్రము ముచ్చటగాఁగ ముద్రితన్
జేయుట దాతవంతు, మఱి చెచ్చెర సర్వశుభ ప్రవృద్ధిఁగై
చేయుట నీదువంతు శశిశేఖరురాణి దయాస్వరూపిణీ! 14



# 1. గురుకటాక్షము

గీ॥ ఆంధ్రభూమండలంబందు నాదవాని
యనెడు మేటిరాజ్యమొకటి యలరుచుండు;
నందుఁ గందరాతి యనెడు నందమైన
పల్లెటూరుండు (గన్నులపండు వగుచు.

చ॥ గురువగు రాఘవేంద్రయతి కూరిమిమీఱఁగ దేశదేశముల్
సరగున సంచరించుచును జక్కని బోధనముల్ బొనర్చుచున్
నరులను పావనాత్ముల నొనర్చుచు నేఁగెను గందరాతి నాఁ
బరగిన పల్లెటూరునకు ద్వైతమతమ్మును బోధచేయఁగన్.

చ॥ కలఁడట విప్రబాలకుఁ డొకండు దరిద్రుఁడు రాఘవేంద్రప
జ్జలజమరందపానమతి సౌమ్యుఁడు వేంకనయన్న పేరితో
వెలసినవాని యింటికిని భిక్షకునై యతియేఁగ నాత్మలో
పలఁ జిగురించు భక్తిమెయి స్వాగతమున్ బచరించి వెండియున్

ఉ॥ గ్రామములోనికేఁగి యటగల్గు ధనాఢ్యులఁజేరి నమ్రతన్
స్వాములవారిరాకయును స్వాగతమున్ మొదలైన సంగతుల్
వేమఱుఁజెప్పి విత్తమును వేఁడఁగ వారిడఁగొంచు భక్తితోన్
బ్రేమముతోడ భిక్షనిడె వేంకన స్వాములవారు మెచ్చఁగన్.

ఉ॥ వాని సభక్తినమ్రతకు స్వామియునమ్మనమెచ్చి, యోయి యె!
ప్డైనియు నాపదల్ కలుగువేళను నన్నుఁదలంపు, మంతటన్
బూనికతో విపత్తు పరిపూర్తిగఁ దీర్తు నటంచు నా యతీ
శానుఁడుప్రీతిఁబల్కి చనెఁ జయ్యన వేంకన తన్వినొందగన్

ఉ॥ ఇట్టుల కొన్ని నాళ్ళు వడి నేఁగిన వేంకనయంతఁ బూన్కితోఁ
గట్టెలకోసమై యరిగె కాననసీమకు నంతలోన న
ప్పట్టణమెల్ల నేలెడి నవాబు మృగమ్ములఁబిల్కుమార్చుచున్
నట్టడివిన్ జరించెను భటావళితో వివిధాయుధాలతో.

గీ॥ పరిఘపట్టిసకరవాల పరశువులను
గరములందున వెసఁదాల్చి కరుల నెక్కి
హయులపై నెక్కి, వివిధవాహనము లెక్కి
ఘోర కాననమంతయుఁ గ్రుమ్మరుచును.

మ॥ పులులన్ జంపెను, భల్లుకమ్ములను దూపుల్ చిమ్మ మ్రందించె, ప
దుల దున్మాడెను, లేళ్ళనున్ జదిపె, నెన్నో దుప్పులన్ దూల్చె, ప
క్షుల జక్కాడెను క్రూర కాసరములన్ గూల్చెన్ విషోగ్రాహులన్
బిలుకున్ మార్చె నవాబు వేటతమినా విఖ్యాతశౌర్యంబునన్

చ॥ అటవిని గల్లు కర్కశమృగావళి నెల్లను నేలఁగూల్చి య
చ్చట నొకమఱ్ఱిచెట్టుకడఁ జక్కని పత్రకుటీర మొందు ము
చ్చటగను నేర్పరించుకొని శ్రాంతి నవాబట పొందుచుండగాన్,
బటుజవమొప్పగా భటుఁడువచ్చి సలాము నొనర్చె నత్తఱిన్ 9

చ॥ తదుపరి నొక్కజాబు సులతానుకరమ్ముననుంచి మ్రొక్కఁగాఁ
జదువను రాని యాయవనజాతుఁడు దాని పఠింపలేక, యె
ప్పిదముగ దిక్కులన్ గనఁగ వేంకన కన్పడ వానిఁబిల్చి నీ
వుదటున జాబునున్ జదివి యొప్పుగ సంగతిఁ దెల్పుమా యనెన్ 10

చ॥ చదువను రాని వేంకనయు స్వాంతము నందునఁ జింతనొంది, నే
నిది చదువంగ లేనని వచించితి నేని నవాబు దారుణా
స్పదమగు కోపమూని కరవాలముచేఁ దల నుత్తరించు ని
ప్డిదిగన ముందు నూయిగను వెన్కను గోయిగదోఁచె నక్కటా! 11

చ॥ అని మనమందు నెంచుసమయాన నవాబతితీవ్రదృష్టితో
విను మిఁక విప్రబాలకుఁడ వేగమె జాబుపఠింపుమంచు నా
తనిరుషతొందరింపఁ గని దన్మన మందున రాఘవేంద్ర ప
ద్వనజములన్ దలంచుచును పత్రము గాంచిన యంత వింతగన్. 12

చ॥ చదువగశక్తి వేంకనకుఁ జయ్యనగల్గె, నవాబుమెచ్చఁగా
సదమలరీతి పత్రమును జక్కపఠించి వచించె నీగతిన్
గదనమునన్ జయంబుఁగనె గ్రన్నన నీదగుసైన్యమంచు నొ
ప్పిదముగ లేఖలోఁ గలదు విశ్రుతరీతి నవాబుశేఖరా! 1

ఉ॥ బాలకునంత గ్రక్కునను బల్లకినెక్కఁగఁజేసి మేళమున్
తాళములున్ జెలంగగను దద్దయుఁ ద్రిప్పుచుగౌరవించి య
బ్బాలకు పాఠశాలకును బంపిన నాతఁడు సర్వశాస్త్రముల్
హాళిని నేర్చె సద్గురుసమగ్రకటాక్షసుధారసాప్లుతిన్. 1

చ॥ చదువరియైన వేంకనను చాలగమెచ్చి నవాబు మంత్రియున్
బదవి నొసంగ నాతఁడును బార్థివునాజ్ఞలఁ దాల్చు చోఁడలన్
సదమలరీతి రాజ్యమును జక్కఁగఁ బాలనసల్పుచుండె నె
మ్మదులను హైందవుల్ ముసలిమానులు మోదముఁజెందునట్లుగన్

చ॥ మతకలహమ్ము లన్ననుడి మచ్చున కెచ్చట లేనియట్లుగా
జతనముతోడ నెల్లరును సఖ్యముతోఁ జరియించునట్లుగా
నతిశయశాంతిసౌఖ్యముల నందఱు హాయిగ నుండునట్లుగాఁ
బ్రతిగనలేనిపాలనము వర్ధిలె యత్తఱి యాదవానిలోన్ 1

మ॥ మతిమంతుండగు వేంకనాహ్వయుఁడు సమ్యక్స్నిగ్ధసంపత్తితో
క్షితిపాలింపఁదొడంగె; మ్లేచ్ఛవిభుఁ డగ్గింపంగ సర్వావనీ
పతులున్ విజ్ఞులు సత్కవీశులు ప్రజావర్గంబు సమ్మోదసం
యుతచిత్తంబుల రామరాజ్య మను చెంతో ప్రీతి శ్లాఘింపఁగన్. 1

గీ॥ ఇట్లు కొన్నివత్సరములు నేఁగినంత
దేశమెల్లఁ జరించుచు దేశికుఁడగు
రాఘవేంద్రుఁ డాదోనిపురమ్ముఁ జేర
వేంకనాహ్వయుఁ డెంతయు వేడ్కమీఱ. 1

గీ॥ భక్తి నెదురేఁగి సాష్టాంగవందనములు
పెక్కు లొనరించి ప్రార్థించి పిదప గురుని
మంగళకరవాద్యములతో మహితగతిని
దన గృహమునకుఁ గొనితెచ్చి వినయమునను. 19

గీ॥ దారపుత్త్రులు హితులు నందఱును గలిసి
యాదరాభిమానంబుల నాదరించి
రాఘవేంద్రయతీంద్రు నమోఘభక్తి
తత్పరతనుఁ దత్పాదపద్మముల కెరగి. 20

గీ॥ ఆగమోక్తని వివిధపూజాదివిధుల
నన్నియు యథావిధిగ నతఁ డాచరించి
స్వామివారికి తచ్ఛిష్యవర్గమునకు
వివిధభక్ష్యభోజ్యములతో భిక్షయొసఁగె. 21

గీ॥ రాఘవేంద్రయతీంద్రుని రాకవినుచు
యాదవానిని గలిగిన యఖిలజనులు
తరలివచ్చిరి తండోపతండములుగ
సచివుఁ డగు వేంక నింటికి సత్వరముగ. 22

గీ॥ వచ్చు జనముల వాంఛల వరుసఁగూర్చి
వివిధరోగాలనెల్లను బిలుకుమార్చి
సంశయాత్ముల సంశయాల్ సరవిదీర్చి
కల్పవృక్షమ్మురీతిగాఁ గ్రాలుగురుని. 23

గీ॥ వృత్తమంతయు సులతాను విని ముదాన
వేంకనామాత్యునిం గాంచి వేడ్కతోడ
మీదు బాపనగురువులు మేమొనర్చు
సేవగోరుదురే యని గుస్తరింప. 24

గీ॥ చేతులనుమోడ్చి యీరీతి చెప్పె మంత్రి
సకలధర్మస్వరూపులు స్వామివారు
మతవిభేదము లెంచరు మానసమున
సమ్మతింతురు మీసేవ సాదరముగ.

గీ॥ హరిహరబ్రహ్మ సురవర్గవరులకైన
వారిమహిమలు చెప్పగా వలనుగాదు
నల్పుఁడగు నేను మీకెట్లు తెల్పగలను?
బూజ్యసిద్దీమసూదఖాన్ భూపచంద్ర!

గీ॥ అనుచు వేంకన పలికిన నాలకించి
యటులె రేపటిదినమున నరుగుదెంచి
స్వామివారిని దర్శించువార మనుచు
నాతనిన్ బంపె మ్లేచ్ఛభూనేత యంత.

గీ॥ వేంక నింటికి నేఁగి యవ్వివరమెల్ల
స్వామివారికిఁ దెలిపిన సంతసించి
మముఁ బరీక్షింపవలెనని మదిఁదలంచె
మీ నవా బల్లెగానిమ్ము వానినన్న.

గీ॥ గురునిమహిమలు చక్కఁగా నెఱుఁగు కతన
సచివుఁ డెంతయు మదిలోన సంతసించె
స్వామిబండారముల్ బైటఁ బఱతు నంచుఁ
దలఁచి ముదమంద దొడఁగె సుల్తానుగూడ.

గీ॥ వివిధమృగపక్షిమాంసముల్ వేడ్కతోడఁ
ద్వరగఁ దెప్పించి వండించి పలువిధాల,
తట్టలనునింపి పైని వస్త్రములుఁ గప్పి
భటులు గొనితేర నాతఁడు పటురయమున.

గీ॥ స్వామి చెంతకు నేఁగి సలాముచేసి
నిలిచిన నవాబు, కన్నుగొనలనె చూచి,
కనకపీఠముఁజూపి సంజ్ఞల నొనర్చె
నందు నాసీనుఁ డగుటకు యతివరుండు. 31

గీ॥ గురుని యాజ్ఞాప్రకారము నరవరుండు
నాసనమ్మునఁ గూర్చుండి యువలఁ బలికె
మీదు దర్శన మొనరింప సాదరమున
వచ్చినారము కన్నార మిచ్చమీఱ. 32

గీ॥ మేము తెచ్చిన నైవేద్య మిపుడు, మీదు
దేవునకు నివేదన మీయగా వలయు న
టంచు మిము భక్తితోడ నర్థించు చుంటి
నేఁడు మాకోర్కె మీరు మన్నించుఁ డనిన. 33

గీ॥ మ్లేచ్ఛరాజు కుతంత్ర మామీఁద నెఱిఁగి
వానికిన్ బుద్ధి గఱపఁగ లోనఁ, దలఁచి
మూలరాముని బూజించి పూజ్యగురుఁడు
జలము తట్టల పైనను జిలుకరించి. 34

గీ॥ తట్టలను గప్పినట్టి వస్త్రముల నెల్ల
తొలఁగఁ జేయుఁ డటంచును బలికినంత
భటులు వైళమె బట్టలు పైకి దీయ
తురక లబ్రమునంద చూపఱులు పొగడ. 35

గీ॥ పలలములకును మాఱు తట్టలను నుండె
ఫలములున్ బూలు హైందవ వంటకములు
సరగ నవ్వానిఁ గన్గొని చకితుఁ డగుచు
మ్రానుపడి నిల్చె నా ముసల్మాను నృపతి. 36

మ॥ కలయో! తెల్వియొ, మాయయో! భ్రమయొ, లేకన్ మంత్రమో! తంత్రమో!
తెలియన్ జాలనివాఁడనై మిగుల సందేహంబులోనుంటి ని
ష్ఫలలం బెట్టుల కంటిముందటనె పుష్పాల్ పండ్లుగాఁ దీపి వ
స్తులుగా మాఱెను నక్కజమ్ముగను దోఁచున్నాకు నీదృశ్యముల్.

ఉ॥ అంచితరీతి పక్షుల మృగావళులన్ వధియించి మాంసమున్
సంచితరీతి వంటలను జల్పఁగఁ జేసితిఁ దట్టలందు నిం
పించితి వాని నన్నిటిని బిమ్మటఁ దెచ్చి యతీంద్రుముందుఁ బె
ట్టించితి, నెట్టివింతలు ఘటిల్లిన వింతటిలోన బాపురే! 38

ఉ॥ ఏదియొ మంత్రమున్ జదివి యిట్టి యతీంద్రుఁడు తట్టలందు హ
స్తోదక మొయ్యనన్ జిలుకఁ జోద్యమదేమియొ, మాంసఖండముల్
ప్రోదిగఁ బండ్లు, లడ్డువులు పూవులుగాఁ గను మాఱిపోయె. నా
కేదియు దోఁపకున్నయది యిత్తరి చిత్తము దత్తరించెడిన్. 39

ఉ॥ ఏమనువాఁడ! నేదిగతి? యేమియొనర్తు నికెందుజొత్తు నీ
స్వామికి నెగ్గుజల్పితి, విపత్తును మీఁదికిఁ దెచ్చుకొంటి, నే
నేమునుపంతగా నెఱుఁగ నెమ్మదిలోపల విస్మరించితిన్
సేమముఁ గూర్ప స్వామికిని జేతులుమోడ్చి నమస్కరించెదన్. 40

ఉ॥ వేంకనమంత్రి మున్ను వినిపించె నితండు మహాత్ముఁడంచు, నే
వంకరటింకరూహలను స్వామిని గట్టిపరీక్ష చేయగా
జంకక నీచవస్తువు లొసంగితిఁ, దుష్టుఁడ మోసపోతి నె
ట్లింక గతేమి యీపయి యతీశ్వరునే శరణంబు వేఁడెదన్. 41

చ॥ అని మదినిశ్చయించుకొని హస్తము లంతట నంజలించి, నె
మ్మన మురియాడ చెమ్మటలు మైఁదొరగంగ, గళంబుదొట్రిలం
గను మొగమందు దైన్యమును గ్రాలగ విన్నదనాన స్వామితో
ననియె నవాబు భక్తియు భయంబు నయం బనయంబుదోఁపగన్.

చ॥ తెలియఁగలేక మీమహిమ దేవరకే నిపు డెగ్గు చేసితిన్
దలఁపకు దానినెమ్మదిని తప్పకగాచి క్షమింపు దాసునిన్
తెలిసియొ నేరకో లఘుమతిన్ బొనరించినతప్పుగావు ని
ర్మలమతి రాఘవేంద్రగురురాణ్మణి యంచు నతాననుండునై. 43

శా॥ మోకాల్ మ్రొక్కులు మ్రొక్కి స్వామికి జనమ్ముల్ చూడదీనాస్యుడై
వాకుల్ తొట్రుపడంగ మెల్లనవచింపన్ జొచ్చు మ్లేచ్ఛాధిపున్
సాకల్యంబుగ రాఘవేంద్రయతిరాట్చంద్రుండు ప్రేమార్ద్రవీ
క్షాకారుణ్యరసప్రసారములు జిల్కన్ బల్కె నీరీతిగన్. 44

ఉ॥ తప్పులు చేయుచుండుటలు ధారుణి మానవనైజమయ్యె, యా
తప్పును దిద్దుకొంట యది తద్‌జ్ఞులనైజము, గాని దాని నే
యొప్పునుగా సమర్థనము నోడక చేయఁ దలంచుటెంతయున్
దప్పగు; దానముప్పగును దద్‌జ్ఞులు మెచ్చరు తత్ప్రకారమున్. 45

చ॥ మొదటఁ బరీక్షపెట్టితివి మోదముతో మరి తత్ఫలంబునున్
దుదకును జూచిమెచ్చితివి, దోసము సైఁపు మటంచుభక్తి సం
పద లురలంగ వేఁడితివి, మామకచిత్తము సంతసిల్లె, నె
క్కొదవయు లేక పాలనము గూర్మినిసల్పు నవాబుశేఖరా! 46

ఉ॥ ధారుణి రాం రహీములను దైవము లొక్కరె యౌనుగాని వే
ర్వేరగు దైవమూర్తులను రీతిని భావన చేయఁగూడ ద
వ్వారల పేరులన్ బ్రజల వాకొను భేదములవ్వి, మానవుల్
తీరులు నొక్కరీతిగద? దేవుఁడు నొక్కఁడె పేర్లనేకముల్. 47

ఉ। కాలముఁ బట్టి దేవజనకాండముఁ బట్టి మతమ్ము లెన్నియో
చాలగఁ బుట్టె లోకమున జాతులువచ్చెను వారివారి పం
థాలనుబట్టి యాచరణధామము లేర్పడె, పేరులెన్నియో
గ్రాలెను సుమ్మి యీభరతఖండమునందు నవాబుశేఖరా! 48

మ॥ నెరసుల్ తోఁపని చెల్మికల్మిదనరన్ క్షీరంబునీరంబు ల
ట్లరయన్ హైందవ ముస్లిముల్ కలిసి స్నేహస్ఫూర్తి వర్ధిల్లు టా
దరణీయంబగు కార్యమౌ, నుభయసార్థక్యంబుఁజేకూరు నం
దఱ కద్దానను శాంతిసౌఖ్యతతు లత్యంతంబు గల్గున్ సుమీ! 49

ఉ॥ తీఱనియమ్మలున్ మునిఁగి తేలుచు నన్యమతాలవారి యా
చారములం గలంచుట పసందగు కార్యమె? రాజునన్న హం
కారముచే యొనర్చితి వకార్యముఁ జూపకు; మాపయిన్ దిర
స్కారముగాని లేక యధికారముగాని మహాత్ములందునన్. 50

మ॥ పరిహాసంబులు సాధుపుంగవుల సల్పంగూడ దేవేళ, నా
ప్పరికింపందగ దాత్మరక్షణము దేవాగారముల్ కూల్చు ము
ష్కరకార్యంబును బూనరాదు; పరయోషన్ గోరగాఁగూడ దు
ర్వరలో సర్వమతాలసమ్మతము లీవాక్కుల్ విచారింపుమా. 51

గీ॥ సకల మతములలోఁగల సారమువిను
పరుల కపకార మొనరింప పాప మబ్బు
పూన్కి నుపకార మొనరింప పుణ్యమొదవు
ననెడి పెద్దలమాట ముత్యములమూట. 52

గీ॥ అనుచు వచియింప సులతానుఁ డాత్మయందు
బంధురానందభరితుఁడై స్వామిఁ గాంచి
ప్రణతి ప్రణుతులఁ గావించి పరమభక్తి
వేడ్క యిగురొత్త యీరీతి విన్నవించె. 53

గీ॥ అనఘ! భవదీయమృదుల చిత్తాబ్జమందు
దయనొసంగితి రొక్కింతస్థలము నాకు
ధన్యుఁడైతిని నిఁకమీఁద మాన్యుఁడఁజుమ
సాటివారల మీకృపాస్యందమునను. 54

గీ॥ చంద్రునకు నూలుపోగను సరణి నేను
నుడుత భక్తిని జాగీరు నుపదగాఁగ
నప్పనముజేయఁ దలఁచితిఁ దప్పకుండ
స్వీకరింపంగ ప్రార్థన చేయుచుంటి. 55

గీ॥ అనుచు సులతాను వచియింప యతివరుండు
నలఁతినవ్వున నీరీతిఁ బలుకసాఁగె
నన్ని సంగతు లుడిగి సన్యాసినైన
మాకు జాగీరు లేలనో మహీప! యనిన. 56

చ॥ అనవుఁడు మ్లేచ్ఛరాజు వినయమ్ముగ వేఱొకసారి మ్రొక్కి యో
యనఘచరిత్ర మీర లిటు లానతి యిచ్చిన నేమనందు వేం
కనవలె నన్ను సత్కృపను గాంచుచు నే నిడుదానిఁ గొంచు ధ
న్యుని నొనరింపుడంచు మృదులోక్తి పదేపది తన్ను వేఁడగన్. 57

చ॥ కరుణ దలిర్పఁగా గురుఁడు గాదనలేక నవాబుఁ జూచి నీ
గురుతరభక్తి నాకు నొనగూర్చె ముద మ్మధికమ్ము, గాన ని
త్తఱి మఱి నేను గోరెదను, తథ్య మొసంగుదు వంచు నెంతు నే
నిరవుగ నీకు నియ్యదియు నిష్టమెయైన వచింపు నా నృపుడున్. 58

చ॥ అదివిని యానవాబువరుఁ డంబరమెక్కిన భంగిపొంగి స
మ్ముదితహృదంతరాళుఁడయి మూర్ధము వంచి మహానుభావ! మీ
కేది మదిసమ్మతమ్మొ యదియే వచియింపుడు, వేరుమాట నే
వదరను మీ కొసంగఁగలవాఁడ నటంచు వచించి నంతటన్. 59

మ॥ పరమానందమునొంది యాయతిసువర్వాణుండు చిత్తంబునన్
దరహాసస్ఫురితాదరుండు జననాథా! తుంగభద్రానదీ
దరి మాంచాలసమాఖ్యగ్రామమును మోదంబార నాకిచ్చినన్
బరితుష్టిం గనువాఁడ నంచు ముద మొప్పం బల్కె యాపిమ్మటన్. 60

ఉ॥ ఆదరమేదురమ్ముగను నచ్చటనే మునుసల్పె యజ్ఞ మా
హ్లాదముతో సురాసురమహామునిసంఘము సంతసింప ప్ర
హ్లాదుఁడు తత్పవిత్రధరయయ్యది నీవిడనెంతువేని యిః
మ్మా! దయ నే గ్రహించెదను యన్యములైన పరిత్యజించెదన్. 61

చ॥ అనివచియింప, సద్గురుని నారసిపల్కె నవాబు భక్తితోఁ
గినుక వహింపఁ బోకుఁడు, పకీరున కియ్యదిమున్నె యిచ్చి నాఁ
డను దిరుగన్ గ్రహించి యది డంబుగ మీపదమందునుంతు నం
చనుచు నవాబుపల్క విని యట్టులె చేయుమటంచుఁ బల్కెనన్. 62

చ॥ వెడలి నవాబుకోటకును వెంటనె వార్త పకీరుకంపి నా
తఁడు వడిరాఁగ వాని కమితమ్ముగు గౌరవమిచ్చి మున్ను నే
నిడినశిలామయస్థలము నిమ్మని దానికి మాఱు సస్యసం
దడిగల గ్రామమిత్తు నని తడ్డయు నచ్చగఁ జెప్పిపిమ్మటన్. 63

క॥ క్రమశాలేయయుతమైన గ్రామమిచ్చి
బదులు మాంచాల యనియెడు పల్లెఁ గొని న
వాబు పకీరుకు సంతృప్తు బరచి, రాఘ
వేం! దయతోఁజేరి యిట్టులవిన్నవించె. 64

ఉ॥ ఈరు మహాత్ములంచు గ్రహియింపక డాంబికవేషభావనా
చారునిగాఁ దలంచితి, యసంగతకార్యమొనర్చినాఁడ నా
పై రుషడించి నాదగు యవజ్ఞతకున్ క్షమియించి త్వత్కృపా
దారకటాక్షవీక్షణసుధారసధారలు జిల్కుమీ ప్రభూ. 66

శా॥ దేవా! మూర్ఖుఁడ మ్లేచ్ఛజాతుఁడ, మదాంధీభూతచేతస్కుఁడన్
గావంగావలెఁ దప్పు చేసితిని నజ్ఞానుండనై, మత్కృతాం
హోవారాన్నిధి కంతు లేదు, శరణంబో రాఘవేంద్రప్రభో
భావాతీతగుణార్ణవా! యనుచు సంప్రార్థించుచున్ వైళమే. 67

ఉ॥ కేలు మొగిడ్చి యిట్లుపలికెన్ మునుపొక్కపకిరు కేను "మాం
చాల" యటన్న గ్రామము నొసంగితి, దానినిమీరు పున్నెపున్
నేలయటంచుఁగోరితిరి, నేనదితిర్గి పరిగ్రహించితిన్
మాలిమి నొందుపల్లె నిడినాఁడ నతం డెద తృప్తి నొందగన్. 68

ఉ॥ అంచితరీతి మీకృపననంతము నందగఁగోరి మీకువాం
ఛించిన యట్టిగ్రామమె యతీశ్వర! నిండగుభక్తితోడ న
ర్పించితిఁ బావకాంఘ్రులకుఁ బ్రీతిని, దీని పరిగ్రహించి ని
ర్వంచితరీతి పావకశుభాశిషమిచ్చి యనుగ్రహింపుమా! 69

గీ॥ అనుచు నర్థింపఁగైకొని యతివరుండు
"గ్రమత మాంచాల బృందావనము నొనర్తు"
నిత్యకల్యాణ మొనరింతు నిఖిలభువికి
సకలజనముల సాకుదు సక్రమముగ. 70

గీ॥ ఎంతవఱ కిట నేనుందు నంతవఱకు
నీయశమ్మును వెసనిల్పు నిశ్చయముగ
ననుచుఁ జెప్పి నవాబును ననిపి రాఘ
వేంద్రుఁడు మఠమ్ము నిర్మించి యెలిమినుండె. 71

## 2. మృత్తికా ప్రభావము

గీ॥ రాఘవేంద్రయతియుమహారాష్ట్రదేశ
సంచరణమును జలిపెడు సమయమందు
స్వామిమఠమునఁ బనిచేయు వాఁ డొకండు
యణుకువనువచ్చి వందన మాచరించి. 1

గీ॥ స్వామి నేవివాహమ్మును జరుపుకొందు
సెలవు మాసము, నొకనెలజీత మిపుడు
కూర్మి దయసేయుఁ డనివేడ గురువరుండు
నలతి నవ్వున వానితో ననియె నపుడు. 2

గీ॥ మృత్తికాశౌచమే నొనరించుచుంటి
మృత్తి కొక్కటె నాదరి నిపుడు కలదు
కాన సమ్మతమేని యద్దాని నీవు
గొనుచు నేఁగు మటంచును గురుఁడు పలుక. 3

గీ॥ స్వామిమహిమల నెఱిఁగినవాఁడు గాన
నదియె పదివే లటంచును జనఁగ; గురుఁడు
మట్టి దోసె డొసంగ నమస్కరించి
కన్నుఁగవ కద్దుకొని మూటగట్టుకొనియె. 4

గీ॥ గురుని సెలవంది బహుదూర మరిగి యతఁడు
మధ్యరాత్రికి నొక్క గ్రామటికఁ జేరి
మహితసౌధము వీధిగుమ్మమ్ము మీఁద
తనువు వాల్చెను గాఢనిద్రను మునింగె. 5

ఉ॥ అంతట సౌధమందు జను లబ్రము నందఁగ భూత మొక్క డ
త్యంత రయాన వచ్చి యట దవ్వున నిల్చి మహారవాన నా
గంతుక! మూటగొంచు వడిగా జను మొండక చోటి కీముహూ
ర్తాంతరమందుఁ బుట్టెడు గృహస్థుని బిడ్డను జంపవచ్చితిన్. 6

చ॥ ధగధగ నగ్నికీలవలెఁ దద్దయు మండెడు నీదుమూట నన్
డెగఁగొను నన్న భీతి యెద తీవ్రము గల్గెడు, నీగృహస్థు నా
పగతుఁడు, వీనిసంతతులఁ బట్టి పలార్చెదు భూతమేను, నిం
పుగ నిడుదానఁ గోరినది మూటను గైకొని యేగుమా యనన్. 7

చ॥ యతివరు శిష్యుఁడంతటను నక్షులు విప్పి సుదూరమందు వి
స్తృతభయమూని తన్ను గనుచున్ బదముల్ కదలించలేక ను
ద్ధతివిడి నిల్చు భూతమును నారసి సద్గురుదత్త మృత్తికా
ప్రతతిమహత్త్వ మిట్టిదని భావమునందుఁ దలంచి పొంగగన్. 8

చ॥ అడిగిన వస్తు విత్తునని యంటివి భూతమ! కుండనిండుగా
వడివడి రూకలీయగలవా! యన నట్టులె యంచు లిప్తలో
కడివెడు తెచ్చి రూకలను గైకొని యేఁగుమటంచు వేఁడన
వ్వాడుగడి గైకొనెన్, గృహము వారలు వేఁడిరిబిడ్డఁ గావగన్.

కం॥ వల్లెయని యాతఁ డత్తఱి
దల్లడమందెడి గృహస్థు తతభయ ముడిపెన్
జల్లని మాటలతో గురు
తల్లజు మహిమలు తలంచి తనమదిలోనన్.

గీ॥ సీతులెన్నియొ వచియించి భూతమునకు
స్వామి నెదనెంచి మృత్తిక జల్లి నంత
భూతరూపము విడివాఁడు పూతుఁడగుచు
స్వర్గధామంబుఁ జేరె చూపరులు మెచ్చ.

గీ॥ అంత మగబిడ్డపుట్టె గృహస్థునకును
నాతఁ డానందమంది యా యవనిసురున
కన్నకూఁతునొసఁగి వివాహమ్ము సలిపె
నిల్లువాకిలిభూములు నిచ్చెఁ బ్రీతి.

కం॥ గురునికటాక్షామృతమే
గురుతరమగుభూతబాధఁ గూల్చుటచేతన్
గురువుదయతోడనొసఁగిన
వరమృత్తిక యతనిపాల బంగరువయ్యెన్.

గీ॥ అంతకొన్నాళ్ళకు గురునిచెంతఁ జేరి
సంగతినిఁ జెప్పిధనము నొసంగ గురుఁడు
సిరులు నాకేల వనిచెప్పి తిరుగనొసఁగి
పిదప నాశీర్వదించి పంపించె నతని.

# 3. ప్రాణదానము

గీ॥ గ్రామ మొక్కటి గదగు దగ్గర "కిరీట
గిరి" యనఁగ నచ్చటకునేఁగె గురువరుండు
నందు దేశాయి రఘునాథుఁ డనెడు శిష్య
వరుఁడు యతిచంద్రుఁ దత్పరివారములను.

గీ॥ వివిధవాద్యాలతోడ రావించి, భిక్ష
సలుప వండించె పిండివంటలను, బహుల
మధుర మధురసతుందిలామ్రఫలరసము
పెద్దగంగాళనిండుగా పిండిపెట్టె.

గీ॥ వందలాదిగభక్తులు వచ్చినారు
స్వామి దర్శనమునకు దేశాయిభవన
మపుడు పెండ్లివా రిల్లట్లు లద్భుతముగ
వెలుఁగఁ దొడఁగెను గురురాకవలన మిగుల.

గీ॥ పనులతొందరలోన నవ్వారలుండు
తఱిని దేశాయి తనయుండు చిఱుతవాఁడు
ఫలరసంబున గాల్జాని పడి గతించె
దాని గమనింపరైరి యత్తఱిని నెవరు.

గీ॥ కొంతసేఁపైన పిమ్మటఁ గొమరునపుడు
వెదకు చాతని సతిగనె విగతజీవు
సుతుని ఫలరసభాండానఁ బతికిఁ; జెప్ప
యలవి గానట్టి దుఃఖాన నటమటించి.

గీ॥ గుండె చట్రాయిగాఁ జేసికొని పడంతి
కనులవెంటను బాష్పముల్ కారుచుండ
బాడబాగ్నిని దాఁచిన వారిధి యటు
పొంగి వచ్చిన దుఃఖమ్ము మ్రింగి కొనియె.

గీ॥ అశుచి సంగతిఁ దెల్పిన యంతఁ రాయ
మగును భిక్షుకునని మది నామె తలఁచి
తనయు శవమును నొకచోట దాఁచి కంది
కుందుచుండెను నొకగదికోణమందు. 7

గీ॥ యతివరుఁడు మూలరామపూజాది విధులు
సలిపితీర్థము నొసగెఁడు సమయమందు
కీటకం బొందు కలశమున్ దాఁటి చదియ
స్వామి వీక్షించి మదిలోన సంశయించి. 8

గీ॥ అశుచి యేదియొ గలిగె మీయాలయమున
దాన నపవిత్రమయ్యె తీర్థమ్ము నేఁడు
దాఁచకుండగ మాకు నిత్తతిని మీరు
దెలుపు డంచును యతిరాజు పలికినంత. 9

గీ॥ సద్గురునిమాట విన్న దేశాయిభార్య
దుఃఖమోపగలేక తోడ్తోడ వచ్చి
గోలుగోలున నేడ్చుచు గురునికంత
సుతుని చావును దెల్పె నశ్రువులుగార. 10

గీ॥ విన్నవారెల్ల రావార్త ఖిన్నులగుచు
చెవులు "రామా" యనుచును మూసికొని రంత
గురుఁడు వారికి ధైర్యమ్ము గరపి పిదప
బాలుశవమును దెప్పించి స్వామి యపుడు. 11

గీ॥ తన కమండలోదకము తత్తనయుమీఁద
చిలుకరించిన యంత నే చిన్నవాఁడు
కన్నవారును దన్నుఁ గన్గొన్న వారు
విభ్రమముబొందఁ గన్నులు విప్పిచూచె. 12

గీ॥ కాలుపాలికి నేఁగిన బాలు మరల
పరమకరుణను బ్రదికించె గురువరుండు
తల్లిదండ్రులు నతిథు లత్యంతమోద
భరితహృదయులు నుత్ఫుల్లవదనులైరి. 13

గీ॥ అద్భుతం బద్భుతం బిది యద్భుతమని
యచ్చటంగల జనులెల్ల నద్భుతముగ
జయజయధ్వానముల్ చాల సలిపినారు
మివుల దేశాయి మోదాన మిన్నుముట్టె. 14

గీ॥ స్వామివారిడ్డ తీర్థప్రసాదములను
ముదముతోఁ గొని భోజనములనొనర్చి
స్వామినెన్నుచు మరియు దేశాయిఁ బొగిడి
జనులు వెడలిరి తమతమ సదనములకు. 15

## 4. పతితోద్ధరణము

చ॥ తిరుపతికేఁగుచున్ గురుఁడు తెర్వున కొండక యాంజనేయ మం
దిరమునుజూచి శ్రద్ధమెయినిల్చి, తదర్చనలెల్ల భక్తిత
త్పరతను జల్పుచోఁ గనకదాసనుమాలఁడు పూజగాంచి, య
త్తఱి నొనరించె సన్నుతులు దవ్వులనుండియె స్వామివారికిన్. 1

చ॥ "మునుజనివ్యాసరాయలుగబుట్టినయప్పుడు నేనువీని చే
తను హరిదర్శనమ్మును ముదమ్మునగాంచితి" నంచుదివ్యదృ
ష్టిని గతమంతయున్ దెలిసి చెంతకుబిల్చియు "నీవుకర్మమో
చనమును నింతదాఁకఁగనఁ జాలకయుంటివ" యన్ననాతఁడున్. 2

చ॥ కలుగగలేదుసామి! చిరకాలమునుండియు మేన్ త్యజింపఁగాఁ
దలఁచుచునుంటి నీ బ్రదుకు దగ్ధభరంబుననుండెఁ ద్వత్కృపా
లలితకటాక్షవీక్షణవిలాసము లించుక బర్వఁజేసి నా
తలఁపు ఫలింపఁ జేయు మని దాసుఁడు దోసిలి పట్టివేఁడగన్. 3

చ॥ అనవిని మూలరాముని శుభార్చనవేళను నీవు నీగృహ
మ్మునఁగల వస్తువేదయిన మోదముతోఁ గొనిరమ్ము నేనివే
దన మొనరింతు రామునకు దానను జన్మవిముక్తి నీకుఁ గ
ల్గును కుశలంబునౌ నని గురుండు వచింపఁ బ్రహృష్టచిత్తుఁడై.

చ॥ పరుగున నింటికిన్ జనియు బట్టెడుసర్షపముల్ గ్రహించి స
ద్గురుని కొసంగ నాతఁడవి కూరిమితోఁ దన వంటవారికిన్
ద్వరగనొసంగి వీని మన వంటలయం దుపయోగపర్చుఁడి
త్తఱి యని యానతీయ మదితత్తరమంది మఠీయపండితుల్.

శా॥ చాతుర్మాసమహావ్రతప్రథితఘస్రాలందు ఖాద్యంబులం
దేతత్సర్షపయుక్తి కూడదని శాసింపంగ నీయాన వి
ఖ్యాతంబైన మఠీయవర్తనల కత్యంతంబు భిన్నంబుగా
దా! తెల్పుండనిపృచ్ఛసేయ యతిమూర్ధన్యుండుపల్కెన్ దగన్.

మ॥ మునుజన్మంబున పూజ్యమిత్రుఁడగుటన్ మోదంబుఁబొంగార నా
తని నామంబిల సుస్థిరమ్మగను నిత్యంబుండ వాడుండు; శం
కను జంకన్ బనిలేదు, సుంతవ్రతవిఘ్నం బింతరా” దంచునా
డిన నాలించి సభక్తి తత్ప్రభృతి యట్లేసల్పి రాచారమున్.

మ॥ జనసంపూజ్యుఁడు రాఘవేంద్రయతిరాట్చంద్రుండు శ్రీమూలరా
ముని పూజావిధులన్ యథావిధిగ సమ్మోదంబుతోఁ జల్పు చుం
డినతీరున్ గడుభక్తి దాసుఁ డతులోడ్డీనానురాగంబుతో
గనె గన్పండువుగాఁగ మేనపులకల్ గ్రమ్మంగ దట్టమ్ముగన్.

చ॥ జని తనదింక నెంతయును సాధకమయ్యె నటంచునెంచుచున్
దనివిని జెందు నాకనకదాసునిగాంచి గురుండు తీర్థ మొ
య్యనను బ్రసాదమీయఁగొని యాతఁడు ప్రీతిత్యజించెమేను పే
ర్మినిజనె జన్మమున్ జరయు మృత్యువు గల్గని యట్టిచోటికిన్.

చ॥ ప్రతిదివసంబునందు, మతిపండుగ పర్వములందుఁగూడ న
ప్రతిహతి సర్షపంబులను వాడుట వాడుకయయ్యె నేఁటికిన్
స్తుతమతి రాఘవేంద్రయతిదూర్వహు నానతి నాదరంబులో
వ్రతముల కెట్టి భంగమును వాటిల దంచును నాఁడు నేఁడును

## 5. పండితుని గర్వభంగము

సీ॥ అల బిరుదువాళ్ళ శ్రీనివాసార్య వరుఁడు
రాఘవేంద్రునిదరికి బిరానవచ్చి
ప్రణతు లొనరించి తా మును వ్రాసినట్టి
వమిత వేదాంతముఁజుపుస్తకముల నొసఁగి.

గీ॥ తాను పరిశీలనమునల్పి ప్రేమమీఱ
పెస నభిప్రాయ మొసఁగఁగా వేఁడు దన
స్వామి వానిని బఱియించి సంతసించి
తీర్థ బిరుదమ్ము నిడెమె నుదీర్ణకృపను.

సీ॥ స్వామి, శ్రీనివాసాచార్య వరులు కలిసి
వసుస భుక్తి గొనుతఱి నావాలచారు
వంటవారలు వడ్డింప స్వామి గొనియెఁ
గాక నాచార్యుఁడద్ది నిరాకరించె.

కం॥ చాతుర్మాస్యదినంబులఁ
బ్రాతిగ నావాలచారు వడిగొన దురిత
వ్రాతమునంభవమగు నను
భీతిని నద్దాని నతఁడు విడిచెన్ గడకన్.

సీ॥ యతియు నిదియంతఁ గ్రేఁగంట నరయుచుండె
భోజనము పూర్తి చేసె నా బుధవరుండు;
యతియు మంత్రఫలాక్షత లతని కొసఁగ
నతఁడు యవ్వానిఁ గైకొని యరిగె త్వరగ.

గీ॥ యాదవేంద్రతీర్థాభిధానాత్మకీన
గురువ కంతయు దెల్పెను గొఱత లేక
ఫలము మంత్రాక్షతలను జూపంగ నవ్వి
కానుపించెను నల్లగా కన్నులకును. 6

గీ॥ కడుపు నొప్పియుఁ గల్గె; మొగమ్ము నందుఁ
గళయడఁగె శ్రీనివాసార్య కవికి నపుడు
యాదవేంద్రతీర్థుండు నయ్యుదియుఁ జూచి
సలిపి నా వపచారమ్ము స్వామి కెదియొ. 7

గీ॥ కనుక నీకిట్టిబాధలు కలిగె ననినఁ
దా నొనర్చిన దోసఁగుఁ దద్దయుఁ దలంచి
రాఘవేంద్రుని కడకు బిరాన నరిగి
తప్పు మన్నింపుమని వేఁడి తత్క్షణంబ. 8

గీ॥ స్వామి సన్నిధిభుక్తి నావాలచారు
తోడ భుజియింప రుజలెల్ల వీడిపోయె
సంతతానందభరితుఁడై స్వామి కపుడు
వందనమ్మును గావించి పలికె నిట్లు. 9

కం॥ వ్యపగత వివేకినై నే
నపచారమొనర్చినాఁడ నత్యంతముగాఁ
గృపఁ జూపుటచే మీరిపు
డపహృత ఖేదుండనైతి నార్యా యనుచున్. 10

ఉ॥ శ్రీయుత రాఘవేంద్రయతిశేఖర! దివ్యమహానుభావ! సు
శ్రీయుతమైన మీమహిమఁ జెచ్చెఱ నే గ్రహియింపలేక మూ
ఢాయత చిత్తవృత్తి నపరాధమొనర్చిన నన్నుఁ గాచి నా
వో! యనఘాత్మ! సంతతపోజ్జ్వల! నిర్మలశాంతిసంయుతా!. 11

శా॥ భావాతీత! భవాబ్ధిపోత! కరుణాపారీణ పూతవ్రతా!
యీవాల్భారునుగొంట పాపమను నూహన్నేను మీవంక్తిలో
భావంబందుఁ దలంచి మానితిని, నాపైఁ బొందితిన్ బాధ లా
ర్యా! విద్వన్మణి రాఘవేంద్రయతిచంద్రా! సాంద్రకీర్త్యుజ్జ్వలా!. 12

మ॥ నిను యుష్మన్మహిమావిశేషమును వర్ణింపంగశక్యంబె! నా
కనఘా! తప్పును గావుమీ యనుచు నిన్ బ్రార్థించినంతన్ శ్రితా
వన! నాతప్పు నడంచి గ్రమ్మఱను నావాల్భారుతో రుగ్మతన్
జనగాఁజేసితి రాఘవేంద్రయతిరాజా! నీకు కేల్మోడ్చెదన్. 13

మ॥ అమితానందముతోడ పూజ్యముగు శ్రీయాంఘ్ర్యబ్జయుగ్మంబు డెం
దమునందున్ బదిలంబొనర్చి జనితోద్యద్భక్తిసంపత్తి ని
త్యముఁ బ్రార్థించెడి యట్టిభక్తులకు సర్వాభీష్టదస్వర్గవృ
క్షముగాఁ బ్రోతువు రాఘవేంద్ర యతిరాజా! భక్తపాలవ్రజా! 14

సీ.॥ అని నుతించి వారిడిన మంత్రాక్షతలను
గొనుచు గురునకుఁ జూపఁగఁ గోముమీఱ
నెఱ్ఱగానుండె, శూలయు నేఁగె నంత
రాఘవేంద్రుని మహిమ ధరన్ జెలంగె. 15

## 6. జ్యోతిష్కత్రయం వం

క॥ జ్యోతిష్కులు ముగ్గురు వి
ఖ్యాతయశులు స్వామివారికడకుఁ గడకతో
బ్రాతిగవచ్చియు తమ వి
ద్యాతిశయముఁ గూర్చి తెలుప నబ్బురమారన్. 1

చ॥ కఠినపరీక్ష నత్తఱినిగట్టిగవారి కొనర్పనెంచి నా
ర్మఠమునసున్న పండితసమాజము, దానినిజూచిస్వామి ని
ర్మతుఁడయి స్త్రీయజాతకఁ మహాంతమొసంగుచుఁబల్కె దీనినిన్
బరనమువేఱువేఱుగను బ్రశ్నసల్పి ఫలాలు తెల్పుఁడీ! 2

చ॥ అనుచును వేలువేలు గదులందున వారల నుంచినంత వా
రనుపమ పాండితీవిభవు లౌటను జ్యోతిషశాస్త్రపద్ధతిన్
గణనమొనర్చి ముప్వురును గ్రక్కున తత్ఫలముల్ వచింపఁగా
విని మఠమందుపండితులు బిగ్గఱగాఁ గడుపుబ్బ నవ్వుచున్.

ఉ॥ ఒక్కఁడు వందయేఁడులని యాయువుఁగూర్చి గుణించిపల్కె, వే
ఱొక్కఁడు మూఁడువందలను చొప్పున నొక్కివచించెఁ; జెప్పె పై
దక్కగ యేఁడువందలని దబ్బున మూఁడవవాఁడు, దీనిలో
నిక్కముఁ దెల్పుఁడీ యనిన నివ్వెఱ బోయిరి వార లత్తఱిన్.

ఉ॥ ముప్వురుగూడ మూఁడువిధముల్ ఫలితమ్ములు చెప్పియున్నవా
రివ్వసుధాతలంబున పురే! యొకటేయొక జాతకానికే
మవ్వముమీఱఁగా నిరుపమానము మీఁదగు ప్రజ్ఞయుంచుబల్
నవ్వులు గుప్పుచున్ దెసలు నాలుగునిండ నవారితోక్తులై.

చ॥ అని మఠమందుఁబండితులు హాస్యముఁ జేయుట చూచి వారలే
మనుటకు నోరురాక వినతాననులౌటను స్వామిఁ జూచి వా
రిని ఫలితమ్ము లిమ్మనగఁ బ్రీతిని వార లొసంగఁ జూచి యం
తన వచియించి చెప్పిరి యదార్థము దబ్బరకాదు సుంతయున్.

చ॥ అన" మఠమందు విజ్ఞు లపుడబ్బురమందుచుఁ గేలుమోడ్చి యో
యనఘచరిత్ర! మీర లిటులాడిన యేమనియందు మీ భువిన్
గన శతమానమాయువని గ్రా శ్రుతివల్కెడి, మూఁడు నేఁడునూ
ర్లనుగల దాయువన్న నితరుల్ విని ఫక్కున నవ్వకుందురే!

మ॥ అని శాస్త్రుల్ వచియింప స్వామియనె నే నద్దానిభావంబు నం
తను వ్రాయుచ్చెద వీరు వ్రాసినది యంతా సత్యమేగాని యం
దున లేశంబు దొసంగులే దధిక విజ్ఞుల్ వీరిపాండిత్యమున్
గన లేకీరలు తప్పటంచునిటు పల్కంజొచ్చి నా రజ్ఞతన్.

శా॥ సందేహంబులుమాని మీర్వినుఁడు నస్మద్వాక్కు; లీమేనికిన్
వందేండ్లాయువుధాత్రిలోపలను; కావ్యశ్రేణులుండున్ ధరన్
వందల్ మూఁడు; సమాధిలోననటుపై వాసించి భక్తార్తు లె
ల్లం దూలించుచునుందు సప్తశతవర్షంబుల్ నిరాతంకతన్.

చ॥ అని గురుఁడానతీయ విని యద్భుతమందిరి శిష్యులెల్ల, వెం
టనె తమశీర్షముల్ ధరనుడాయఁగ మ్రొక్కిరి జోస్యులున్, ముదా
నను గురుఁ డంతవారికి ధనమ్ము లశేషమొసంగ వారల
త్యనుపమ మోదభారమున నాతని మెచ్చుచుఁ బోయి రిండ్లకున్. 1

## 7. క్షామనివారణము

శా॥ తంజాపూరు పురమ్మునన్ బ్రబలె నుద్యద్దీప్తి క్షామంబు త
జ్జంజాటమ్మునఁ జిక్కి తిండికిని నోఁచన్ లేక భూతౌఘముల్
సంజాతవ్యధచిక్కి స్రుక్కి బహుధాసంతప్తమై బొబ్బలో
య్యం జల్పంగను జూచి భూవిభుఁడు చింతాక్రాంతచిత్తుండనై.

చ॥ కరువు నడంపఁగాఁ దలఁచి క్ష్మాపతి యెన్నియొ భూరియిష్టముల్
జరిపెనుగాని చొటనిడుసస్యమెయయ్యెను; కుంభకోణమన్
బురముననున్న పూజ్యగురుముఖ్యుని వద్దకునేఁగి భక్తితోఁ
గరములుమోడ్చి యిట్లనెను గన్నుల దైన్యము తొంగిచూడఁగన్.

చ॥ జలములులేవు త్రాగుటకు, సస్యములేమియుఁ బండకుండె, నెం
డలు కడుతీవ్రమౌటను జనమ్ములు బాధలనొందుచుండి రో
యలఘుచరిత్ర! తావకకృపామృతవర్షమునింపి మత్పురిన్
గల జనసంఘమున్ వడిగఁ గావవె! బాధలనెల్ల బాపవే.

మ॥ అని తంజాపురిఱేఁడు భక్తియుతచిత్తావిష్టదుఃఖమ్ముతో
దను ప్రార్థించిన రాఘవేంద్రయతిరాడ్వర్యుండు సంతోషమం
ది నృపాలాగ్రణి మీపురమ్మునకు నే వేవచ్చి తత్ క్షామమం
త నివారించెద మూలరామునికృపాధారామృతౌఘంబుచే.

బంధుర ప్రీతి నీవిధినిపల్కుచు వైళమ రాఘవేంద్ర క
ర్మందియు తంజపూరరిగి రాజగృహంబున మూలరామునిన్
బొందుగనుంచి శాస్త్రవిధిపూజలొనర్పఁగఁ దత్కృపాప్తి చే
తం దగవర్షముల్ గురిసెఁ దత్ప్రజలెల్లరు హర్షమందగన్. 5

కుంభవృష్టిగ వర్షముల్ కురిసినంతఁ
బంటలును పండె, సంతసం పడిరిప్రజలు
రాఘవేంద్రుని మహిమానురాగములను
దంజపురినాథుఁ డాత్మసంతసము నొందె. 6

కుంభకోణమరిగె యతికుంజరుండు
యతికి రాజంపె రత్నాలహార మొకటి
వైశ్వదేవమ్ము జలిపెడు పట్టునందు
నందె హారమ్ము యతి యది యగ్నికిడియె. 7

లక్షల విలువగుహారము
నాక్షణమున నగ్నివైచె యతివరుఁ డని యా
యక్షరములు విని క్ష్మాపతి
యక్షయదుఃఖమ్ము నొందె, నటుపై మరలన్. 8

స్వామిదగ్గర కొకమారు చని నృపుండు
వినతులొనరించి యీరీతి విన్నవించె
పూర్వమిచ్చిన హారమ్ము బోలుదాని
వేరు చేయింతు దాని జూపింపుఁడనిన. 9

యతియు నగ్నినిఁ బ్రార్థింప నతఁడు తెచ్చి
స్వామి కిడెహార, మది చూచి ప్రభువు మిగుల
గురునిశక్తికి మదిని నబ్బురము నంది
వినతు లెన్నియొ నొనరించి వెడలెఁబురికి. 10

# 8. బ్రాహ్మణత్రయము వాంఛాపూరణమ

గీ॥ శ్రీ యతీశుమహిమ పరీక్షించుటకును
బ్రాహ్మణులు మువ్వు రాత్మలోపలఁ దలంచి
కుంభకోణమునకువచ్చి కూర్పఁగలఁడె
దమ మనమ్ముల కోర్కెలఁ దనివిమీఱ.

గీ॥ అనుచు మనముల ననుకొని యంతవారు
కోర్కె లేరికిచెప్పక కుదురుగాను
స్నానములుసల్పఁ జొచ్చిరి నదిని, నచట
స్వామిశాటిక లుదికెడు ఛాత్రుఁ డొకఁడు.

గీ॥ వాని నుదుకుచుఁ గనుఁగొని బ్రాహ్మణులను
తానమొనరించిరండు సిద్ధముగనుండెఁ
దమరు వాంఛించునవి పదార్థము లటంచుఁ
బలుకవారలు నాశ్చర్యభరితులైరి.

గీ॥ ఉదికి బట్టలు బండపై నుంచు శిష్యు
నరసి మాకోర్కెలెట్టు లీవెఱిఁగితి వన
ద్విజులఁ గాంచుచు నాకేమి తెలియ దనుచుఁ
బలుకవారలు విస్మితస్వాంతులైరి.

గీ॥ స్నానమొనరించి గురువరుశాటులెల్ల
వేగఁ జేఁబూని యిటుపల్కె విప్రులార!
సత్వరంబుగరండు భోజనముఁజలుపఁ
వంటకాల్ సిద్ధమయ్యె మీవాంఛితములు.

గీ॥ వారలున్ స్నానసంధ్యల వడి ముగించి
స్వామిశాటుల మహిమాతిశయము మనకు
శిష్యుచేతను జెప్పింపజేసె ననుచు
భక్తి కేఁగిరి స్వామిని బొగడుకొనుచు.

ం॥ ఒక్కఁడు చిత్రాన్నము, నిం
కొక్కఁడు పాయసమును, మఱియొక్కఁడు కుడుముల్
మక్కువఁ దినగోరిరి ముం
దక్కజముగ నవ్వి విస్తరాకుల నిడఁగన్. 7

ం॥ మదిఁగోరినవంటక మ
య్యదనున వడ్డించినార లవ్వారలకున్
గుదురుగ, నదిగని యతివరు
సదమల మహిమలను నుతులు సలుపుచు వారల్. 8

ం॥ కడుపార భుజించి పయిన్
వడిగాఁ జని యతివరు పదపద్మమ్ములపైఁ
బడి వందనము లొనర్చిరి
తడయక నొనరించినారు తత్సంస్తుతులన్. 9

॥ విప్రులార! వాంఛలు నెఱవేఱె ననెడు
గురువరున్ జూచి వారలు త్వరగ నెఱఁగి
స్వామి మీమహిమ నెఱుంగ వశమె మాకు?
నేరమున్ సైఁపు మంచనివారు పలుక. 10

॥ మహి భవిష్యత్తునందు బ్రాహ్మణులుగాన
నాదుబృందావనముపూజ లాదరమునఁ
జలుపుదురు మీరలింక మీసంతతు లని
మించి యాశీర్వదించి పంపించె నపుడు 11

## 9. పునఃప్రాణప్రతిష్ఠ

॥ పాతహుబ్బళ్ళిగా నేఁడు వరలునట్టి
పుదిసమీపకృష్ణాపురమునకు గురుఁడు
సకలపరివార సహితుఁడై సత్వరముగఁ
గాలినడకనువచ్చు మార్గమ్మునందు. 1

ఉ॥ సూర్యుని యెండ వేఁడిమికి స్రుక్కుచు దేవుని పెట్టెమోయు నా
చార్యులు, సేవకప్రజలు, ఛాత్రులు పల్లకిమోయు బోయలున్
ధైర్యముదక్కి పెన్ శ్రమకు తల్లడమందుచు విశ్రమించుటే
కార్యమటంచు నెంచుతఱిఁ గంటికిఁబండువుగాఁగ ముందటన్. 2

మ॥ ఫలవృక్షంబులతో, సుగంధకుసుమవ్రాతంబుతోఁ గండుకో
యిలనాదంబులతో, లతావితతితో నింపైన సొంపైన ని
ర్మలవాఃపూరితసారసాకరముతో రాణించుఁబూఁదోఁట వా
రలు వీక్షించిరి యందుఁజేరిరి పరిశ్రాంతాత్ములై యుండుటన్. 3

చ॥ వనమునకేఁగి వారలటు వంటలు వార్పులుఁ జేసి పిమ్మటన్
మునుకొని మూలరామునకు బూజలొనర్ప మటన్న సద్గురుం
డనుపమప్రీతి రాఘవుని కర్చనముల్ బొనరించి పిమ్మటన్
ఘనతరబోధనల్ సలుపగా దొరకొన్నతఱిన్ హుటాహుటిన్. 4

గీ॥ అల్ల హుబ్బళ్ళి పరిసరమందుఁ గల్గు
నట్టి తాలూకఁ బాలించు నా నవాబు
స్వామి విడిసిన తద్వనప్రాంతమందు
నొక్క భవనాన బసచేసి యుండె నపుడు. 5

గీ॥ స్వామిరాకనుగని ఱేఁడు భార్యతోడ
వచ్చి పెక్కుసలాములు వరుసఁజేసి
హస్తములుమోడ్చి నిలుచున్న యతనిగాంచి
యలఁతి నవుమోముతో నిట్టు లనియె యతియు. 6

గీ॥ నీదుభక్తికి మదిని జనించె ముదము
వాడియుండెను కనుదోయి వదన మపగ
తప్రభంబయి నీరసతను వహించె
కారణం బేమొ తెల్పుమీ క్రమముగాను. 7

చ॥ అని గురుఁడాడఁగా వినిన యావనభూపతి వాని బీబియున్
గనులను బాష్పజాలములు కాలువలై ప్రవహింప నేడ్పుతో
డను రమణీయదృశ్యములు డంబుగ నొప్పెడునట్టి యీపుర,
మ్మనిన మహాముదంబు హృదయంబున గల్గును మాకునిచ్చలున్. 8

ఆ॥ కట్టుకొంటి మిచటఁ గమనీయ దృశ్యసం
పన్నమగు విశాలభవన మొండు
వచ్చి యుప్పు డపుడు వసియించుచుందు మీ
వనముమధ్యగల భవనము నందు. 9

ఉ॥ ఈరమణీయ దృశ్యములు నింపును సొంపు వహించు సచ్ఛుభా
కారములైన వృక్షములు ఁగన్నులపండువు లౌ లతావళుల్
సారసచంచరీకశుకసారిక మంజులగానమాధురీ
సారము గ్రోలవచ్చెదము స్వాంతమునన్ విహరించు వాంఛతో. 10

కం॥ ఈమధ్యను నిటవచ్చియు
నామాడువునందునుండి యమితానందం
బాముకొనుమదిని సుతుఁడా
రామములోనికిని నేఁగి ప్రముదముతోడన్ 11

కం॥ విహరించుచుండ నచ్చట
నహియొండు నికుంజమందునాత్మజు కరవన్
స్పృహదప్పి నేలఁ బడియెను
సహచరు లదిచూచి మిగుల సంభ్రమమతులై. 12

కం॥ పరువెత్తివచ్చి నారలు
త్వరగా నెఱిఁగింప, మేము తటకాపడి స
త్వరమంత్రౌషధములు ము
మ్మరముగ నిడినాము గాని మడసె నతండున్. 13